# ప్రేమమూర్తి

(బుద్ధచరిత్రము)

గ్రంథకర్త:
శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి
అధ్యాపకులు
ఆంధ్రక్రైస్తవ కళాశాల, గుంటూరు

ప్రభు అండ్ కో.,
గుంటూరు

# ప్రవేశిక

ప్రపంచములో గొప్ప గొప్ప మహాపురుషులు అప్పుడప్పుడు జన్మించుచుందురు. అటువంటి మహానుభావులలో అగ్రస్థానము అందుకో గలవాడు గౌతమ బుద్ధుడు.

బుద్ధుడు – క్రీస్తు – గాంధి – ఈ ముప్వురు అహింసాజ్యోతిని నలుమూలల వెలిగించిన అమరమూర్తులు; మానవుల మనస్సులలోని మాలిన్యమును తొలచివైచిన మహామానవులు; కరుణయే జీవితసర్వస్వ మని చాటి చెప్పిన విశ్వ వైతాళికులు.

ఈ ముగ్గురు మూర్తులలో ఇరువురు మన భారతమాత కడుపుననే పుట్టినారు. ఇది అన్నిదేశాలకంటె భారతదేశమునకు గల ప్రత్యేకత. అందువల్లనే భారతభూమి 'రత్నగర్భ' అనే అన్వర్థనామము ధరించి వాసికెక్కినది.

ప్రస్తుతము మనము చదువుచున్నది బుద్ధభగవానుని చరిత్ర. ఇందులో బుద్ధుని జననము మొదలు నిర్యాణము వరకు గల కథ ఆరు భాగాలుగా నిబద్ధమైనది. ప్రతిభాగమునకు కథాసందర్భమును బట్టి ప్రత్యేక నామము ఉంచబడినది.

ఈ చిన్న పుస్తకము సాయమున ఉదీయమానులైన విద్యార్థులు బుద్ధచరిత్రము గ్రహించి, అందలి ఆదర్శము పరిగ్రహించగలరని ఆశించు చున్నాను. ఈ ప్రయత్నమునకు విద్యావేత్తలు చేయూత నీయగలరని విశ్వసించుచున్నాను.

— "కరుణశ్రీ"

* శుభోదయము
* రాజహంస
* యశోధర
* నగర సందర్శనము
* మహాప్రస్థానము
* ధర్మచక్రము

# శుభోదయము

మన భారతదేశములో ఉత్తరమున మహోన్నతము
లగు హిమాలయపర్వతములు విరాజిల్లుచున్నవి. ఆ పర్వత
ములకు సమీపమున 'రోహిణి' యను నది ప్రవహించు
చున్నది. ఆ నదీతీరమున ''కపిలవస్తు'' వను నొక పెద్ద
పట్టణముండెడిది. ఇప్పటికి దాదాపు రెండువేల అయిదు
వందల సంవత్సరముల క్రిందట ఆ నగరమును రాజధానిగా
జేసికొని శుద్ధోదన మహారాజు శాక్యరాజ్యమును పరిపా
లించుచుండెను.

శుద్ధోదన రాజేంద్రున కిరువురు భార్యలు కలరు.
వారిలో పెద్ద భార్య మాయాదేవి. రెండవ భార్య ప్రజా
వతి. వారిద్దరు నక్కచెల్లెంద్రగుటచే భేదభావములేక
ఎంతయో ఐకమత్యముగా నుండెడివారు. శుద్ధోదన
మహారాజు భార్యల నిరువురను చాల ప్రేమగా చూచు
చుండెడివాడు.

శుద్ధోదన మహారాజునకు సువిశాలమైన రాజ్య
మున్నది. కావలసినన్ని ధనసంపద లున్నవి. ఆకాశము
నంటు చక్కని మేడలు లెక్కకు మిక్కిలిగా నున్నవి.
వందలకొలది రథములు, వేలకొలది గజములు, లక్షల

కొలది హయములు నున్నవి. ఎందరెందరో దాసదాసీజను లున్నారు. కాని పాప మాయనకు సంతానము మాత్రము లేదు. పాలబుగ్గల పసిబిడ్డ కోసరమై మహారాజ దంపతులు ఎన్నో వ్రతములు చేసిరి. ఎన్నెన్నో నోములు నోచిరి. పెక్కులు దానధర్మములు గావించిరి. లెక్కలేని పుణ్య క్షేత్రములు దర్శించిరి. దేవతలకు మ్రొక్కుకొనిరి.

ఒక రోజు రాత్రి మహారాణి మాయాదేవి అంతః పురములో మేడపైన ఏడవ అంతస్తులో మెత్తని పట్టు పరుపుమీద పవళించియుండెను. నిద్రాసమయములో ఆమె కొక విచిత్రమైన కలవచ్చినది. ఆ స్వప్నములో ఎవరో యిరువురు దేవదూతిక లాకాశమునుండి దిగివచ్చిరి. వచ్చి ఒక విమానములో మహారాణి నెక్కించుకొని తీసికొని పోయిరి. ఆ విమానము పోయిపోయి హిమాలయపర్వత శిఖరముమీద ఆగినది. ఆ దేవదూతిక లక్కడ జలజల ప్రవహించుచున్న సెలయేటిలో రాణిని హాయిగా స్నానము చేయించిరి. మహారాణి విలువగల జలతారు పట్టుచీర కట్టు కొని ఒక రత్న సింహాసనము నలంకరించినది. దేవ దూతికలు పారిజాతపుష్పముల మాలలుతెచ్చి ఆమె మెడలో వేసిరి. ముఖమున కస్తూరి తిలకము తీర్చిదిద్దిరి. ఆ చల్ల గాలిలో, ఆ పండు వెన్నెలలో మహారాణి ఆకాశము వేపు

చూచుచు కూర్చుండినది. వినీలాకాశమున చక్కని చుక్కలు తళుకు తళుక్కున మెరయుచున్నవి.

అంతలో ఒక చక్కని చుక్క ఆకాశము మీది నుండి మెల్లమెల్లగా క్రిందికి దిగివచ్చినది. ఆరుకోణములు గల ఆ నక్షత్రము క్షణములో ఒక తెల్ల ఏనుగుగా మారి పోయినది. ఆ యారుకోణములు ఆ హస్తీంద్రిమున కారు దంతములై పోయినవి. రాణి రెప్పవాల్పక ఆ విచిత్ర దృశ్యము వీక్షించుచున్నది. ఆ తెల్లని గజరాజు చల్లగా వచ్చి మాయాదేవి గర్భములో కుడిప్రక్కగా ప్రవేశించినది.

కల కరిగిపోయినది. మాయాదేవికి మెలకువ వచ్చినది. ఆమె ఉలికిపడి లేచి "ఎంత వింత కల" అను కొనినది. పక్కదిగి చకచక రాజుగారి దగ్గరకు పోయి తన స్వప్నవృత్తాంత మంతయు పూసగ్రుచ్చినట్లు చెప్పినది. ఆ విషయము వినగానే శుద్ధోదన మహారాజునకు కూడ విశేషవిస్మయము కలిగినది.

మరునాటి యుదయమే మహారాజు పేరుగాంచిన పెద్దపెద్ద జ్యోతిష్కులను పిలిపించి మహారాణి స్వప్న వృత్తాంతము వివరించెను. 'ఈ కలకు ఫల మేమిటో తెలియజేయు' డని ప్రార్థించెను.

ఆ శాస్త్రజ్ఞులు కొంచెముసేపు వ్రేళ్ళు గణించి, గుణించి, బాగుగా ఆలోచించి ఈ విధముగా మనని చేసి కొనిరి. "మహారాజా! రాణిగారికి వచ్చిన స్వప్నము చాల శుభప్రదమైనది. ఇక మీ కోరికలు తీరిపోవును. ప్రజల భాగ్యములు పండును. మహాప్రభావము గలవాడు, ప్రపంచము నుద్ధరించువాడు నగు బాలుడొకడు పట్టపు రాణి గర్భమున జన్మింపబోవుచున్నాడు. ఇదే ఆమె కలకు కాగల ఫలము."

పండితుల మాటలు విని రాజదంపతు లెంతయో సంతసించిరి. మహారాజు జ్యోతిష్కులకు ముత్యాల దండలు రత్నాల హారములు బహూకరించి పంపినాడు.

కొలది రోజులలోనే మాయాదేవి గర్భముదాల్చినది మహారాజునకు ఎప్పటికంటె ఆమెమీద అధికమైన యను రాగము కలిగినది. ఆమె కోరినదెల్ల సమకూర్చుచున్నాడు ఆమెను పూలలోబెట్టి పూజించుచున్నాడు. క్రమముగా మహారాణికి నవమాసములు నిండినవి.

ఒకనాడు మాయాదేవి పురిటికి పుట్టింటికి వెళ్లుటకై మహారాజును అనుజ్ఞ అడిగినది. మహారాజు చిరునవ్వు

నవ్వుచు "అంతకన్న కావలసిన దేమున్నది!" అని ఆమె ప్రయాణమున కన్ని యేర్పాట్లు కావించినాడు.

మాయాదేవి పుట్టినిల్లు దేవదహమను నగరము. ఆ దేవదహము కపిలవస్తుపట్టణమునకు కొన్ని క్రోసుల దూరములో నున్నది. మహారాజు మార్గము పొడవున చలువపందిళ్లు వేయించినాడు. బాటకు రెండుప్రక్కల కన్నుల పండువగా అరటి స్తంభములు నాటించినాడు. మాణిక్యమయములగు మంగళకలశములను నిలిపించినాడు. అక్కడక్కడ చలివేంద్రములు పెట్టించినాడు. పచ్చని మామిడాకుతోరణములు ముచ్చటగా కట్టించినాడు.

మహారాణి మాయాదేవి పట్టుకుచ్చుల పల్లకిలో కూర్చుండి పుట్టింటికి ప్రయాణమైనది. వేలకొలది దాస దాసీజనము వెంటవచ్చుచున్నారు. రాణిగారి ముద్దుల చెల్లెలు ప్రజావతి కూడ అక్కతోపాటు బయలుదేరినది. కళకళలాడుచు కనులవిందుచేయుచున్న ఆ మార్గమున చల్లగా మెల్లగా పల్లకీ ముందునకు సాగిపోవుచున్నది.

దూరముగా కనుపించుచున్న హిమాలయపర్వత శిఖరములను, గాలికి కదలుచున్న పచ్చని పంటచేలను—

కళకళలాడుచున్న పండ్లచెట్లను— జలజల ప్రవహించుచున్న సెలయేళ్ళను చూచి చూచి అక్కచెల్లెండ్రు మహానంద మందుచుండిరి.

కొంతసేపటికి పల్లకీ ఒక వనములో ప్రవేశించినది. దానిపేరు లుంబినీవనము. ఆ లుంబినీవనమును చూడగానే మహారాణి మనస్సు సంతోషపరవశమై పోయినది. రక రకాల పూలచెట్లు రమ్మని తనను పిలచుచున్నట్లుగా తల లూపుచున్నవి. పెద్దపెద్ద సరస్సులలో కలువలు, పద్మాలు సరససౌరభములు విరజిమ్ముచున్నవి. లేతలేత మామిడి చివుళ్ళు తిని కోకిలలు గొంతెత్తి కమ్మగా రాగాలు తీయు చున్నవి. చిన్న చిన్న కురంగములు — కుందేలుపిల్లలు పచ్చికబయళ్ళమీద చెంగుచెంగున గంతులు వేయుచున్నవి.

మహారాణి ప్రజావతిని చూచి "చెల్లీ! ఈ లుంబినీ వన మెంత బాగున్నదే! ఆ లేడిపిల్ల చూడు మనవైపే ఏలాగు చూచుచున్నదో! ఆ కొండ కాలువ ఎంత వేగ ముగా పరుగిడుచున్నదో కనుగొంటివా! ఆ చిలుకలు కిల కిల లాడుచు బిలిబిలి పలుకులు పలుకుచున్నవి విను చుంటివా!" అన్నది. ప్రజావతి "అక్కా! అట్లయినచో యీ లుంబినీవనములో కొంచెముసేపు హాయిగా విశ్రాంతి

తీసికొందమా !" అని అడిగినది. మహారాణి 'సరే' అని తల యూపినది.

రాణిగారి ఆజ్ఞానుసారము పల్లకీ లుంబినీవన మధ్యములో ఆగినది. మాయాదేవి ప్రజావతి చేయిపుచ్చుకొని మెల్లగా పల్లకీ దిగి గుమ్మటమువలె నున్న ఒక గున్న మామిడి క్రింద కూర్చుండినది.

మాయాదేవి కొంతసేపు విశ్రాంతి తీసికొని నవనవలాడుచున్న ఒక లేతమామిడి కొమ్మను చేతితో అందుకొని ముద్దుపెట్టుకొనినది. అది చూచి ప్రజావతి పకపక నవ్వుచు "అక్కా ! నీ హృదయ మెంత మెత్తనిదే! నీవే యింత కరుణగలదానివే! ఇక నీ కడుపులో ఉన్న చిట్టి తండ్రి ఎంత దయామయుడో !" అని పలికినది. అక్కచెల్లెండ్రిద్దరు కొంచెముసేపు నవ్వుకొనినారు.

అంతలో మాయాదేవికి ప్రసవవేదన ఆరంభమైనది. దాసీలు జాగ్రత్తగా చకచక అన్ని యేర్పాట్లు చేసిరి. ఆ లుంబినీవనములో — ఆ మధ్యాహ్న సమయములో — ఆ బాలరసాలము నీడలో మహారాణి కొక చక్కని కుమారుడు జన్మించినాడు. ముక్కుపచ్చలారని ఆ ముద్దులబిడ్డ ఎంతటి మహత్త్వము కలవాడో

మరి ! ఆ సుముహూర్తములో చెట్లన్నియు పూల వానలు కురిపించినవి. భూదేవి పులకించినది. సెలయేళ్లు పొంగులెత్తినవి. ఆకాశము స్వచ్ఛమై ప్రకాశించినది. మందమారుతము వీచినది. పక్షులు మధుర గీతము లాలపించినవి.

ఈ శుభవార్త వెన్వెంటనే శుద్ధోదన మహారాజున కందింపబడినది. ఇక మహారాజు సంతోషాని కంతు లేదు. ఆయన వెంటనే బయలుదేరివచ్చి మేళ తాళాలతో మహావైభవముగా మాయాదేవిని కపిలవస్తు పట్టణమునకు తీసుకొనివెళ్ళినాడు. మహారాణి కుమారునితో పట్టణము ప్రవేశించినదని తెలియగానే ప్రజలందరు మేడలెక్కి వేయి కళ్ళతో ఆమెను సందర్శించినారు. పుణ్యకాంతలు వారిపై పుష్పవర్షము కురిపించినారు. ఆ రోజు రాజధాని క్రొంగ్రొత్తశోభతో రమణీయమై విరాజిల్లినది. ఎక్కడ చూచినను మహోత్సవములే ! ఎటు కన్నను వేడుకలే ! ఏ గృహప్రాంగణమున జూచినను మంగళతోరణములే !



# రాజహంస

శుద్ధోదన మహారాజు రాజ్యమంతట పుత్రోత్సవము చాటబంచినాడు. పట్టణములోని పెద్ద ముత్తైదువలందరు రాజనందనుని సందర్శించిపోవుటకై గుంపులు గుంపులుగా వచ్చి మంచి మంచి బహుమానములు మహారాణి కర్పించి నారు. దేశములోని రాజులు మేలుజాతి గుఱ్ఱములు గజ రాజములు రత్నహారములు తెచ్చి మహాప్రభువునకు బహూకరించినారు. నెమలిపింఛములు గురివెందదండలు పిల్లనగ్రోవులు కొల్లలుగా తెచ్చి కోయరాజులు రాజేంద్రు నకు కానుక చేసినారు. చామరములు, పులిగోళ్ళు, కస్తూరి, ఇప్పపూలు, పునుగు, జవ్వాది, పుటకతేనె గైకొనివచ్చి చెంచుదొరలు మహారాజునకు సమర్పించుకొన్నారు. కపిలవస్తుపట్టణములో కని విని యెరుగనంత మహావైభవ ముగా పుత్రోత్సవము జరిగినది.

ఇంతలో ఒక గొప్ప మునీశ్వరుడు రాజమందిరము లోని పసిబిడ్డను చూచిపోవచ్చెను. ఆయన పేరు అసితుడు. అసితమహర్షి చాలకాలమునుండి ఎక్కడో కొండ గుహ లలో కూర్చుండి తపస్సు చేసికొనుచుండెడివాడు.

మహర్షిని చూడగానే మహారాజు భక్తిపూర్వకముగా లేచి సాష్టాంగనమస్కారముచేసి బంగారుపీఠముమీద కూర్చుండ బెట్టెను. మాయాదేవి ముద్దుల కొడుకును మహర్షికి చూపించెను. అసితమహర్షి ఆ బాలుని ముఖము చూడగానే ఆనందముతో మైమరచిపోయెను. ఆయన ఆ పసిపాప లేత లేత చేతులను పాదములను ముద్దుపెట్టుకొని కన్నుల కద్దుకొనినాడు. ఆ మెత్తని పాలబుగ్గలను వ్రేళ్ళతో స్పృశించినాడు. ఆ బాలునికి భక్తిపురస్సరముగ ప్రదక్షిణ మాచరించి ప్రణామము చేసినాడు.

అది చూచి రాజదంపతు లాశ్చర్యపడిరి. అసిత మహర్షి శుద్ధోదన మహారాజు నుద్దేశించి "రాజేంద్రా! ఈ బాలుడు మహాప్రభావశాలి. ఇతడు పుత్రుడై జన్మించుటచేత నీ జన్మము ధన్యమైనది. నీ అదృష్టము పరిపక్వమైనది. ఈ కుమారుడు నిన్ను, నీ రాజ్యమును మాత్రమే కాక ఈ సమస్త ప్రపంచమును సముద్ధరించుటకై జన్మించినాడు. సాక్షాత్తు భగవంతుడే నీ యింట నిట్లు పసిబాలుడై యుద్భవించినాడని నా విశ్వాసము. ఇతని సందర్శనము కొసరమే నేను చిరకాలమునుండి నిరీక్షించుచున్నాను. ఈ నాటికి నా కోరిక ఫలించినది. ఈ మహాత్ముని కడుపార

కన్న మాయాదేవి పూర్వజన్మములో ఎంత పుణ్యము చేసి కొన్నదో!" అని పలికెను.

మహర్షి మాటలువిని రాజు రాణి పట్టరాని ఆనంద మనుభవించినారు. అసితమౌని మరొకమాటు బాలకునికి నమస్కరించి కనులార చూచి రాజదంపతులను దీవించి వెడలిపోయినాడు.

మాయాదేవి ముద్దుల తనయుని చూచుకొని మురిసి పోవుచున్నది. క్రమముగా ఆరు రోజులు గడచిపోయినవి. ఏడవరోజు పాలుత్రాగి పక్కమీద పడుకొని అమాయక ముగా తన్ను చూచుచున్న పసిబిడ్డను మాయాదేవి పలక రించినది "నాన్నా! నీ కోసమై ఎన్నాళ్ళ నుండి ఎదురు చూచినాను! ఇన్నాళ్ళు నా కన్నులకు కనిపించకుండ ఎక్కడ దాగియున్నావు తండ్రీ! నీ పాలబుగ్గలు, నీలి ముంగురులు, చిరునవ్వులు చిందిపోవు ముద్దుల ముఖము ఎంత చూచిన తనివితీరుటలేదు! కుమారా! నిన్ను చూచిన ఈ కన్నులతో ఈ పాపిష్ఠి లోకము నిక చూడలేనురా!" అనుచు మరల మరల ముద్దాడినది. ఆమె కుమారుని వద నమువైపు కన్నార్పకుండ అల్లే చూచుచున్నది. చూచి చూచి ఆ యానందములో మాయాదేవి మైమరచిపోయినది.

ఆమె కడసారి కన్నబిడ్డను కన్నార కనుగొన్నది. ఆ సంతోషభారములో ఆమె కనురెప్పలప్పే వ్రాలిపోయినవి.

అంతే! మాయాదేవి మరల కన్నులు తెరవలేదు. ఆమె గుండె ఆగిపోయినది. ఆమె జీవితము పూర్తియైనది. కళకళలాడుచున్న కపిలవస్తుపట్టణము వెలవెల బోయినది. రాకుమారుడు తల్లిలేని పిల్లవాడైనాడు.

అక్క చనిపోయిననాటినుండి చెల్లెలు ప్రజావతి బాలకుని ప్రాణసమానముగా పెంచి పెద్దచేసినది. కంటికి రెప్పవలె కాపాడినది. కన్నతల్లిలేని లోటు కనిపించకుండ పిన్నతల్లి చేతులలో రాజకుమారుడు హాయిగా పెరుగుచున్నాడు.

మహారాజునకు కుమారుడు జన్మించగానే కోరికలన్నియు సిద్ధించినట్లయినది కనుక అతనికి "సిద్ధార్థుడు" అని పేరు పెట్టినారు. వారిది గౌతమ గోత్రమగుటచే "గౌతము"డనియు రాజనందనుని పిలుచుకొనుచుండిరి.

సిద్ధార్థుడు అంతఃపురములో అల్లారుముద్దుగా పెరిగి పెద్దవాడగుచుండెను. ప్రజావతి ప్రతిరోజు కుమారుని పన్నీటస్నానముచేయించి, పట్టుచొక్కా తొడిగి, అలకలు దువ్వి, తిలకము దిద్దెడిది. పండువెన్నెలలో వెండిపళ్లెరములో వేడివేడి పాయసము తినిపించెడిది. కొసరి కొసరి

గోరుముద్దలు పెట్టెడిది. బంగారు తూగుటూయెలలో పరుండబెట్టి జోలపాటలు పాడెడిది.

బాలగౌతముడు వచ్చిరాని జిలిబిలి పలుకులతో "అమ్మా! అమ్మా! అని పిలిచినప్పుడు ప్రజావతికి తన అక్క మాయాదేవి తలపునకువచ్చి కన్నులు ద్రవించెడివి. గౌతముడు కిలకిల నవ్వినప్పుడు సరిగా అక్క నవ్వినట్లే యుండెడిది. "ఏది! మరొక్కసారి నవ్వు నాన్నా!"అని ఆమె కొడుకును మరల మరల నవ్వించుచు బ్రహ్మానంద మనుభవించెడిది.

గౌతముడు తల్లి పెట్టిన తీయతీయని తాయము లన్నియు తీసికొనివెళ్ళి తోడిపిల్లలకు పంచిపెట్టెడివాడు. క్రమముగా రాకుమారుని కెనిమిదేండ్లు వచ్చినవి. మహా రాజు కుమారున కతివైభవముగా ఉపనయనము చేసినాడు. పెద్దలు బాలుని దీవించినారు.

అనంతరము రాజకుమారుడు 'విశ్వామిత్రు' డను నుపాధ్యాయునికడ వివిధ విద్యలను నేర్చుకొనినాడు. వేద ములు శాస్త్రములు కావ్యములు పురాణములు పఠించినాడు. అరువదినాలుగు కళలు అభ్యసించినాడు. కొలదికాలములోనే గుఱ్ఱపుస్వారిలో కత్తియుద్ధములో ప్రవీణుడైనాడు. విలు విద్యలో ఆరితేరినాడు. అన్ని విద్యలలో "అందెవేసిన

చేయి'' అనిపించుకొనినాడు. శుక్లపక్షచంద్రునివలె దిన దినాభివృద్ధి నందుచున్న తనయుని గని మహారాజు హృదయసాగరము సంతోషతరంగములతో నిండిపోవు చుండెను.

ఒకరోజు రాజసభకు కొందరు జ్యోతిష్కులువచ్చిరి. మహారాజు వారికి తన కుమారుని జన్మపత్రిక చూపెను. జ్యోతిశ్శాస్త్రజ్ఞులు గౌతముని జాతకమును పరిశీలించి "మహారాజా! నీ కుమారుడు సమస్తప్రపంచమును పరిపాలింపగల సార్వభౌముడో, లోకమునుద్ధరించు మహాయోగీశ్వరుడో కాగలడు" అని చెప్పి చనిరి.

జ్యోతిష్కుల మాటలు వినగానే శుద్ధోదనునికి పెద్ద సందేహము కలిగినది. ఒక వేళ తన కుమారుడు యోగీశ్వరుడే అగునేమో! అట్లు కారాదు. నా కుమారుడు చక్రవర్తియే కావలెను! అని ఆయన తలంచెను. అందులకై ఆయన కుమారునకు క్రొత్త క్రొత్త మేడలు కట్టించెను. చక్కని పూలతోటలు వేయించెను. గౌతముడు లోకములోని కష్టములను దుఃఖములను చూడకుండవలెనని యాయన ఉద్దేశము. కాని రాజకుమారుడుమాత్ర మెప్పుడు ఏదో ఏకాంతముగా ఆలోచించుచుండెను. ఏమి టేమిటో తలపోయుచుండెను.

ఒకనాడు గౌతముడు స్నేహితులతో కలసి యూరి బయటకు విహారమున కేగెను. అక్కడ దేవదత్తుడను మిత్రుడు "గౌతమా! మన గుఱ్ఱములలో నేది ముందు పరుగెత్తునో పందెము వేసికొందమా?" అని మిత్రుల నడిగెను. అందరు 'సరే' యనిరి.

గుఱ్ఱములు పర్వెత్తుట ప్రారంభించినవి. అందరి యశ్వములకంటె గౌతమునిదే ముందు పరుగిడినది. గౌతముడు పందెము గెలిచినాడు. కాని అలసిపోయిన తన హయమును చూచుసరికి రాకుమారుని హృదయము కరిగిపోయినది. గుఱ్ఱమునకు దిగ చెమటలు పట్టినవి. నోటివెంట నురుగుపడుచున్నది. ఆ రొప్పుచున్న సైంధవమును చూచి గౌతముడు జాలిపడి వెంటనే క్రిందికి దిగినాడు. ఉత్తరీయముతో దానియొడలు తుడిచి బుజ్జగించినాడు. వీపుమీద చేయిపెట్టి నిమురుచు "అశ్వరాజమా! నా కోసము నీ వెంత కష్టపడినావు!" అని బ్రతిమాలినాడు. రాకుమారుని చూచి గుఱ్ఱము సంతోషముగా సకిలించినది.

మఱియొకనాడు గౌతముడు మిత్రులతో కలసి వేటకు వెడలెను. ఆయన బాణమెక్కుపెట్టి గురిచూచి పరువెత్తుచున్న యొక బాలహరిణమును కొట్టబోయెను.

లేడి గౌతమునివైపు జాలిగా చూచెను. రాజకుమారుడు చేతిలోని ధనుర్బాణములు క్రిందపడవైచి వెంటనే ఇంటికి తిరిగివచ్చెను.

ఇంకొకరోజు సాయంసమయమున గౌతముడు దేవదత్తుడు ఊరివెలుపలి ఉద్యానవనమునకు బోయిరి. కిల కిల కూయు పక్షులు — కలకలలాడు పుష్పములు వారికి స్వాగతమిచ్చినవి. ఇంతలో ఆకాశములో ఒక హంసల బారు ఎగిరిపోవుచుండెను. గౌతముడు వానిని చూచి "ఆహా! ఆ హంస లెంత అందముగ నున్నవి! వెండి రేకులవంటి రెక్కలాడించుచు నెంత చక్కగా ఎగిరిపోవు చున్నవి." అనెను.

వెంటనే దేవదత్తుడు విల్లెక్కుపెట్టి యొక పదునైన బాణమును వదిలెను. ఆ అమ్ము రివ్వునపోయి ఆ గుంపులో నొక రాజహంస డొక్కలో గ్రుచ్చుకొనినది. పాపము! ఆ దెబ్బకు హంస అరచుచు గిరగిర తిరుగుచు నేలమీద పడినది. ఒక్క క్షణములో నంతయు జరిగి పోయినది.

గౌతముడు గబగబపోయి క్రిందపడిన ఆ రాయంచ నొడిలోనికి తీసికొనెను. మెత్తని వ్రేళ్ళతో మేను నిమురుచు మెల్లగా బాణము బయటికి తీసెను. ఉత్తరీయ

ముతో నెత్తురు నద్ది రెక్కలు దువ్వి "ఏమియు భయము లేదులే!" యని దానికి ధైర్యము చెప్పెను. అంతలో దేవదత్తుడు రొప్పుచు రోజుచు నచ్చటికి వచ్చెను. అతనిని చూడగానే రాజహంస భయపడి రెక్కలు ముడుచుకొని గౌతముని యొడిలో తలదూర్చెను. "రాజకుమారా! ఈ హంసను నేను నేలకూల్చినాను. నాదానిని నాకిమ్ము" అని దేవదత్తుడు నొక్కి పలికెను. గౌతముడు "దేవదత్తా! ఈ హంస నీదికాదు. నాది. నేను దీనిని కాపాడినాను. దీనిమీద నీకధికారము లేదు" అని ఖండితముగా సమాధాన మిచ్చెను. దేవదత్తుని కావేశ మాగలేదు. "రాజకుమారుడ నను నధికారగర్వముతో నా హంస నపహరింప జూచు చుంటివా!" అని యతడు తీవ్రస్వరమున ననెను. గౌతముడు శాంతముగా "దేవదత్తా! ఇందులో అధికార మేమున్నది. ఇది నా ధర్మము. పాపము! ఎక్కడనో పుట్టి, ఎక్కడనో పెరిగి, ఏ సరోవరములలోనో భగవంతుడిచ్చిన గ్రుక్కెడు నీరు ద్రావి తన త్రోవలో తాను బోవు నీ హంస నీకేమి హాని చేసినది? దీనిని నీవు హింసించుట చాల తప్పు" అని పలికెను.

దేవదత్తున కా మాటలు చెవికెక్కలేదు. అతడు వెంటనే రాజసభలోనికివచ్చి "మహారాజా! గౌతముడు

నా హంస నన్యాయముగా నపహరించినాడు. తాము న్యాయము దయచేయవలయును'' అని మొరపెట్టుకొనెను. మహారాజు న్యాయాధికారులవైపు చూచెను.

అంతలో గౌతముడు హంసతో నక్కడికి వచ్చి జరిగినదంతయు విశదీకరించెను. ఈ విషయములో న్యాయ నిర్ణయ మెట్లు జరుగవలెనో ఎవ్వరికిని తోచలేదు. న్యాయాధికారు లొకరి మొగమువంక నొకరు చూచుకొను చుండిరి.

ఇంతలో ఒక వృద్ధమంత్రి లేచి "గౌతమా! ఆ హంస నీ బల్లమీద నుంచుము. మీ రిర్వురు దూరమున నిలుచుండి దానిని బిలువుడు. ఎవరిదైన వారి దగ్గరకే అది వచ్చును'' అని పల్కెను.

సభ్యులందరు మంత్రి యుక్తికి చాల సంతోషించిరి. గౌతముడు రాయంచను మంత్రి చెప్పిన బల్లపై నుంచెను. దేవదత్తుడు సమీపమునకు వచ్చి "రావే! హంసా! రా నా దగ్గరకు రా!'' అని చేతులు చాచెను. మరాళము భయముతో గడగడ వడకుచు వెనుకకు బోయెను.

తరువాత గౌతముడు చేతులు చాచెను. తక్షణమే హంస ఆనందముతో ఎగిరి రాకుమారుని చేతులలో వ్రాలెను.

సభ్యులు హర్షధ్వనులు చేసిరి. దేవదత్తుడు తలవంచు కొనెను.

మహామంత్రి మందహాసము చేయుచు "పక్షి ప్రాణ రక్షకునిదే కాని ప్రాణభక్షకుని దెట్లగును ? అని పలికెను.

రాజకుమారుడు హంసను అనురాగముతో కొన్నాళ్లు పోషించి దానికి బాగుగా బలమువచ్చిన తరువాత "హాయిగా ఆడుకో ! పో !" అని ఆకాశములోనికి వదలివేసెను. ఆ తెల్లని హంస నల్లని ఆకాశములోనికి మెల్లమెల్లగా ఎగిరిపోయెను.



# య శో ధ ర

గౌతమునకు బాల్యము గడచినది యౌవన మడుగు పెట్టినది. పెద్దవాడగుకొలది రాజకుమారునకు ప్రపంచ మంతయు చిత్ర విచిత్రముగా కనిపించినది. గౌతముడు తన ఏడంతస్తుల మేడ మీద చివరి యంతస్తులో నిలువబడి కపిలవస్తు పట్టణము నలువైపుల పరికించెడివాడు. అప్పు డాయన కీ జగమంతయు నదేదో విధముగా దోచెడిది. మేడ ప్రక్కగా జలజల ప్రవహించి పోవుచున్న రోహిణీ నది, దూరముగా ఆకాశములోనికి చొచ్చుకొనిపోయిన హిమాలయపర్వత శిఖరములు రాజకుమారున కేదో రహ స్యము చెప్పుచున్నట్లు కాన్పించెడివి. ఆయనను తన దగ్గ రకు రమ్మని పిలచినట్లుండెడివి.

రాజకుమారు డెప్పుడు నేకాంతముగా కాలము గడి పెడివాడు. ఒంటరిగా గూర్చుండి ఏమేమియో ఆలోచించు చుండెడివాడు. మిట్టమధ్యాహ్నమున, మండు టెండలో మలమల మాడుచు పొలములలో పనిచేయు కష్టజీవులను గాంచునప్పు డాయన గుండెలు నీరై పోయెడివి. అబ్బులు కాయలుకాచి గాయములై దున్నలేక దున్నలేక దుక్కి దున్ను బక్కచిక్కిన ఎద్దులను చూడగానే గౌతముని

కన్నీరు కాలువలు గట్టెడిది. ఒడలు దిగ చెమటలుపెట్టి కట్టెలమోపులు మోసికొని వచ్చు నిరుపేదలను పరికించి యువరాజు చాల బాధపడెడివాడు. కట్ట గుడ్డ, తిన తిండి లేని దిక్కుమాలిన దీన భిక్షుకులు కంటబడినప్పుడు గౌత ముని మనస్సు కరుణతో కరిగిపోయెడిది.

ఇతరుల కష్టములను యువరాజు చూడలేకపోయెడి వాడు. ఏదో విధముగా వారికి సాయపడి సంతోషము కలి గించవలెనని ఆయన తహతహలాడెడివాడు. ఆయనకు ఎక్కడ చూచినను ప్రపంచమంతట వ్యాపించియున్న బాధలే పదేపదే కనిపించుచుండెడివి.

ఒకరోజున ఒక పూలతోటలో సరస్సు ఒడ్డున కూర్చుండి గౌతముడు కన్నార్పకుండ నీటివంక చూచు చుండెను. ఇంతలో ఒక చిన్న పురుగు నీటిమీద ప్రాకి పోవుచుండెను. ఆ పురుగుచెంత కొాక పెద్ద పురుగు చటు క్కునవచ్చి గుటుక్కున మ్రింగినది. అంతలో ఒడ్డున నున్న కప్ప ఆ పెద్దపురుగును పట్టుకొన్నది. తరువాత ఒక త్రాచుపాము చరచర వచ్చి ఆ కప్పను బట్టి కబళించినది. మరుక్షణములో ఆకాశముమీదనుంచి రివ్వుమని గరుడపక్షి యొకటివచ్చి యా పన్నగమును తన్నుకొని పోయినది.

ఈ చిత్ర మంతయు రెప్పవాల్చక చూచుచుండిన గౌతమున కాశ్చర్యము గలిగినది. "ఈ ప్రపంచములో నెక్కడ చూచినను బాధలు — హింసలు తప్ప, శాంతి సంతోష ములు లేనే లేవేమో!" అని ఆయన అనుకొనినాడు. అనేకములైన ఆలోచనలలో ఆయన మనస్సు అల్లకల్లో లమై పోయినది.

ఎల్లప్పుడు పరధ్యానముగ నుండు కుమారుని చూచి మహారాజు మనస్సు పరిపరివిధముల సందేహించినది. 'ఒక వేళ జ్యోతిష్కులు చెప్పిన రెండవమాటయే నిజ మగునేమో! తన కొడుకు చక్రవర్తియై రాజ్యము పాలించ కుండ సన్యాసియై దేశములవెంట తిరుగునేమో!' అని యాయనకు భయము కల్గినది.

మహారాజు కుమారుని మనస్సును రాజభోగముల వైపు మరలించవలెనని ఎన్నియో ప్రయత్నములు చేసి నాడు. ఎన్ని చేసినను గౌతముని మనోభావములలో మార్పు రాలేదు.

ఒకరోజున మహారాజు మంత్రులనందరిని పి పించి ఇట్లనెను. "మన గౌతముని మనస్సు రోజురోజు నకు మారిపోవుచున్నది. అతని హృదయ మెల్లప్పుడు నేవేవో ఆలోచనలతో నిండి బాధపడుచున్నది. రాజ

కుమారునికి రాజకార్యముల పై కుతూహలము కనిపించుట లేదు. అతనిని క్రమమార్గములోనికి రప్పించుట కేమైన మంచి యుపాయ మాలోచింపవలయును.''

మహారాజు మాటలు విని ప్రధానమంత్రి ''ప్రభూ! కొలది రోజులలో మన శాక్యుల పండుగ వచ్చుచున్నది. ఆ పండుగనాడు మన రాజ్యములోనున్న రాజపుత్రికల నందరిని కపిలవస్తుపట్టణమునకు ఆహ్వానింతము. వారంద రికి వరుసగా యువరాజుచేత బహుమానము లిప్పింతము. ఆ సమయమున మన రాజకుమారుని మనస్సు ఏ రాజ కుమారిమీద లగ్నమగునో ఆమె నిచ్చి వివాహము చేయుదము. అప్పుడు యువరాజు ప్రవర్తన తప్పక బాగు పడును.'' అని సమాధానము చెప్పెను.

రాజాజ్ఞ యైనది. రాజ్యములోని రాజు లందరకు వర్తమానములు పంపబడినవి. పండుగరోజునకు రాజ పుత్రిక లందరును కపిలవస్తుపట్టణమునకు వచ్చిరి. ఆ నాడు వసంతపంచమి. శాక్యుల కది పర్వదినము. రాజోద్యాన ములో రత్నములు చెక్కిన బంగారు సింహాసనముపై రాజకుమారుడు కూర్చుండి యుండెను. రెండు ప్రక్కల లెక్కలేనన్ని రత్నహారములు, ముత్యాలసరములు,బంగారు

పాత్రములలో తళతళ మెరయుచుండెను. అటునిటు పరిచారికలు పళ్ళెరములు పట్టుకొని సిద్ధముగా నుండిరి. అందముగా అలంకరించుకొని వచ్చిన రాజపుత్రిక లందరు వరుసగా నిలువబడియుండిరి.

ఒక్కొక్క రాకుమార్తెయు నొయ్యారముగా నడచి వచ్చి రాజకుమారుని ముందు నిలువబడుచుండెను. రాజకుమారుడు పళ్ళెరములలోని ఒక్కొక్క రమణీయ రత్నహారమును చేతితో నందుకొని కన్నులు జిగేల్ మనిపించుచు ఆ రాజకుమారికి బహూకరించుచుండెను. ఆమె కొంచెము ముందునకు వంగి హార మందుకొని యువరాజుకు నమస్కరించి ప్రక్కకు తొలగిపోవుచుండెను. ఈ విధముగా రాజపుత్రికలు ఒకరివెంట నొకరువచ్చి బహుమతులు పరిగ్రహించుచుండిరి. క్రమముగా పళ్ళెరములోని హారములు తరగిపోవుచుండెను.

చిట్టచివర కొక రాజకుమారి వచ్చినది. ఆమె పేరు యశోధర. అందములరాశి యగు నా సుకుమారి అల్లంత దూరమున వచ్చి నిలచినది. గులాబీపూలవంటి తన అరచేతులు ముందునకు చాచినది. గౌతముడు బహుమానముకోసరమై పళ్ళెరముల వంక చూచెను.

ఒక్క హారముకూడ మిగిలియుండలేదు. ఆ చక్కదనాల చుక్క వచ్చి ఎదుట నిలచియున్నది. పాపము! ఆమె చేతులుకూడ చాచినది. ఇప్పుడేమి చేయవలెను?

వెంటనే రాజకుమారుడు తన కంఠము నలంకరించి యున్న పచ్చలపతకము తీసి ఆమె కరకమలములలో నుంచెను. ఆమె సిగ్గుతో తలవంచుకొని ఆ హారమును కన్నుల కద్దుకొన్నది. యశోధర మేలిముసుగు కొంచెము జారినది. రాజకుమారుని నయనభృంగము లామె ముఖ పద్మముపై వ్రాలినవి. అదేసమయమున ఆ రాజకుమారి కూడ కొంచెము సిగ్గుతో తలయెత్తి యువరాజువైపు చూచి నది. ఇరువురి చూపులు నైక్యమైనవి. "ఈమెకు నాకు వెనుకటి జన్మలో నేదో సన్నిహితమగు సంబంధమున్నది" అని రాజకుమారు డనుకొనెను.

యశోధర సవినయముగా యువరాజునకు నమస్క రించి చిరునవ్వుతో వెనుకకు వెడలిపోయినది. గౌతము డానందముతో నాసనమునుండి లేచినాడు. నూత్నకాంతితో విలసిల్లుచున్న గౌతముని వదనము చూచి మహారాజు మానస ముప్పొంగిపోయినది.

శుద్ధోదన మహారాజు యశోధర తండ్రియైన సుప్రబుద్ధ మహారాజు దగ్గరకు రాయబార మంపెను. ఈ సంగతి వినుసరికి సుప్రబుద్ధునికి పట్టరాని సంతోషము కలిగినది. కాని ఒక్క సందేహ మడ్డువచ్చినది. గౌతముడు మెత్తని చిత్తము కలవాడనియు, క్షత్రియోచితములగు ధైర్యసాహసము లాయనకు లేవనియు నాతనికి దెలియ వచ్చినది.

సుప్రబుద్ధుడు తన మంత్రులతో నాలోచించి శుద్ధోదన మహారాజున కీవిధముగా నొక వర్తమానము పంపించెను. "శుద్ధోదన రాజేంద్రా! మీ కుమారునికి మా యశోధర నిచ్చి పరిణయము చేయుటకు మా కభ్యంతరము లేదు. కాని మీ గౌతముడు నిరంతర మేదో చింతించుచుండు ననియు, రాజ్యసౌఖ్యములపై నంతగా అతనికి మమకారము లేదనియు వినియున్నాము. అందుచేత మా యశోధరకు స్వయంవరము నిశ్చయించినాము. ఆ స్వయంవరమునకు రాజకుమారుడు గౌతముడు విచ్చేసి విజయము గాంచినచో మా రాజకుమారి యతని మెడలో పూలమాలవేసి వరించును. అనంతరము వారి వివాహ మహోత్సవము నేర్పాటు గావింతుము."

ఆ సందేశము వినగానే శుద్ధోదనభూకాంతునకు చాల నిరుత్సాహము కలిగినది. కాని రాజకుమారుడు మహారాజునకు ధైర్యముచెప్పి "మహారాజా! నేను యశోధరా స్వయంవరమున కరిగి నా ధనుర్విద్యా పాండిత్యము ప్రదర్శించి విజయశ్రీ సంపాదించుకొని వచ్చెదను" అని పలికి ఆయన ఆశీర్వాదము లందుకొని సుప్రబుద్ధుని పట్టణమునకు బయలుదేరెను.

సుప్రబుద్ధుడు నానా దేశములనుండి తన తనయ స్వయంవరమునకై వచ్చిన రాజనందను లందరికి స్వాగతమిచ్చి గౌరవించినాడు.

రాకుమారు లందరు తళతళలాడుచున్న మణిమయ భూషణములు ధరించి బారులుతీర్చి తమతమ పీఠములపై కూర్చుండియుండిరి. సభా మధ్యమున "సింహహానువు" అను పెద్దవిల్లు విరాజిల్లుచుండెను. సుప్రబుద్ధుడు తన సింహాసనమునుండి లేచి రాజకుమారులను చూచి "వీర కుమారులారా! మీలో ఈ విల్లు వెక్కువెట్టి ఒకే బాణముతో ఆ కన్పించు ఏడుచెట్లను ఖండింపగల బలశాలి కంఠమున మా యశోధర జయమాల నలంకరింపగలదు" అని పలికెను.

నాగదత్తుడు, దేవదత్తుడు మొదలైన రాజకుమారు లందరు రొమ్ములు విరుచుకొనుచు ముందునకు వచ్చిరి. కాని వారిలో నొక్కడును సింహహనువు నెక్కుపెట్టలేక పోయెను. ఇంతలో సింహకిశోరమువలె గౌతముడు ముందు నకు వచ్చి వింటిదగ్గరకుపోయి అవలీలగా దాని నెక్కు పెట్టి అమ్ము విడిచినాడు. ఆ బాణము రివ్వునబోయి ఏడు వృక్షముల నొక్కపెట్టున నేలగూల్చినది. అందరకు నానం దాశ్చర్యములు కలిగినవి. యశోధర పూలమాలతో గౌతముని కంఠము నలంకరించినది. ఈ శుభవర్తమానము శుద్ధోదన మహారాజునకు వెన్వెంటనే తెలియజేయబడినది. కపిలవస్తుమహారాజు సంతోషపరవశుడై సపరివారముగా బయలుదేరి సుప్రబుద్ధ పురమునకు వచ్చెను. యశోధరా గౌతముల కల్యాణమహోత్సవము జయప్రదముగా జరిగినది.

గౌతముడు యశోధరాదేవితో హాయిగా కాలము గడపుచుండెను. చిలుక గోరువంకలవలె అన్యోన్యానురాగ ములతో నలరారుచున్న కొడుకును కోడలిని చూచుకొని రాజు, రాణి మురిసిపోవుచుండిరి.

ఇప్పుడు గౌతమునకు యశోధర ప్రాణము. యశో ధరకు గౌతముడు దైవము. కొంతకాలమున కా క్రొత్త

దంపతుల కొక చక్కని కుమారుడు జన్మించెను. ఆ బిడ్డకు "రాహులు" డని నామకరణ మొనర్చిరి. రాహులుని చిరు నవ్వులో నూత్నదంపతులైన యశోధరా గౌతములు పొంగి పులకించిపోవుచుండిరి.

శుద్ధోదనమహారాజు కుమారుని కోసరమై రోహిణీ నదీతీరమున చక్కని పాలరాతిమేడ కట్టించినాడు. ఆ మేడచుట్టు విశాలమైన పూలతోటవేయించినాడు. ఆ తోటలో అక్కడక్కడ పెద్దపెద్ద సరస్సులు త్రవ్వించినాడు. ఆ సరోవరమునిండ కలువపూలు తామరపూలు కన్నులపండువు చేయుచున్నవి. స్వచ్ఛమైన జలతరంగములలో రాజ హంసలు బాతులు ఒయ్యారముగా ఈదులాడుచున్నవి. చెట్లనీడలలో మయూరములు పింఛములువిప్పి నాట్యము చేయుచున్నవి. కోయిలలు తీయని గొంతులతో 'కుహూ కుహూ' అని సంగీతము పాడుచున్నవి. రామచిలుకలు కొమ్మలమీద కూర్చుండి కలకల కిలకిల పలుకుచున్నవి. చల్లగాలికి పూలబాలలు కదలి కమ్మని సుగంధములు విరజిమ్ముచున్నవి. భూలోకస్వర్గమువలె నున్న ఆ యుద్యాన వనములో సుగుణరాశియైన యశోధరతో, మణిదీపము

వంటి కుమారునితో గౌతముడు సుఖముగా కాలము గడుపుచుండెను.

శుద్ధోధన మహారాజు కొడుకుమీద కొండంత ఆశపెట్టుకొని యుండెను. తన కుమారుడు తనకన్న గొప్ప చక్రవర్తి కావలెననియు భారతదేశములోని రాజులందరు శిరస్సులువంచి అతని పాదపద్మములకు జోహారులు చేయవలయుననియు ఆ మహారాజు కలలు కనుచుండెను.



# నగర సందర్శనము

ఒకరోజు మహారాజు గౌతముని పిలిచి "నాయనా! నేను చాలకాలమునుండి ఈ శాక్యరాజ్యమును పరిపాలించు చున్నాను. మా ముత్తాతగారి తరువాత తాతగారు, తాతగారి తరువాత మా నాయనగారు, ఆయన యనంతరము నేను నీ రత్నఖచిత సింహాసనము నధిష్ఠించి ఈ రాజ్యము నేలుచు వచ్చితిమి. ఇక ముందీ భారము నా కుమారుడ వగు నీవు వహింపవలయును. ఈ సువర్ణ కిరీటము తలపై ధరించి ఈ శాక్యసింహాసనము నెక్కి వంది మాగధుల కైవారము లందుకొనుచు, ప్రజల జయజయ ధ్వనులతో నీవు రాజ్యపరిపాలనము చేయుచుండుట కన్నుల పండువగా చూడవలయునని నా కోరిక. పాలసముద్రములో అంద ములు చిందు చందమామవలె మా శాక్యవంశములో జన్మించినావు! నీవు చతురంగబలములను వృద్ధిచేసికొని నేర్పుగా ఈ పదవి నిర్వహింపవలయును" అని పలికెను.

గౌతముడు తండ్రి చెప్పిన మాట లన్నియు శ్రద్ధగా ఆలకించినాడు. కొంచెము సేపు ఆలోచించి "నాన్న గారు! రాజ్యపరిపాలనమునకు సముచితమగు సామ ర్థ్యము, చాకచక్యము కావలయును. లోకములోని మంచి

చెడ్డ లన్నియు నా కింకను సరిగా అర్థము కాలేదు. సావధా నముగా ఆలోచించుకొని నా అభిప్రాయము తమకు మనవి చేసుకొనగలను '' అని పలికెను.

క్రమముగా గౌతముడు మనస్సు మార్చుకొని మంచిమార్గములోనికి వచ్చుచున్నాడని మహారాజు చాల సంతోషించెను. అలవిమాలిన తన ఐశ్వర్యముపై కుమారున కాసక్తి పెంపొందించవలయునని ఆయన అనుకొనెను.

ఒకనాటి యుదయమున రాజకుమారుడు మహా రాజుతో తాను నగరమంతయు నొక్కమాటు సందర్శించి వత్తునని చెప్పెను. వెంటనే శుద్ధోదనుడు చెన్నుడను సారథిని పిలిపించి రథము సిద్ధముచేయుమని ఆజ్ఞాపించెను. చెన్నుడు క్షణములో అందముగా అలంకరించిన తెల్లగుఱ్ఱ ముల రథము సిద్ధముచేసి తెచ్చెను.

చెన్నుడు నమ్మకమైన సారథి. ఎన్నో ఏండ్ల నుండి శుద్ధోదనమహారాజు సేవ చేయుచున్నాడు. అత నికి గౌతమునిపై మిక్కిలి మక్కువ. చెన్నుడు ''రాజ కుమారా! రథము సిద్ధముచేసినాను.'' అన్నంతనే గౌతముడు నవ్వుచువచ్చి స్యందనములో కూర్చుండెను.

సారథి పగ్గములు సడలించెను. రథము రాజమార్గములో సాగిపోవుచుండెను.

శుద్ధోదనమహీపాలుని ఆజ్ఞానుసారముగా పట్టణ మంతయు చక్కగా అలంకరింపబడినది. ఏవీథి చూచినను కళకళలాడుచున్నది. మార్గమున కిరుప్రక్కల పచ్చని మామిడాకుతోరణములు వ్రేలాడుచున్నవి. త్రోవయంతయు పన్నీటిజల్లులతో గుమగుమలాడుచున్నది. మేడలమీద జెండాలు మేఘములను ముద్దాడుచున్నవి. పట్టణములో ఎక్కడను విచారకరమైన దృశ్యములు గౌతముని కంట బడరాదని మహారాజు కట్టడచేసినాడు.

రథము ముందునకు సాగిపోవుచున్నది. మేడవెంట మేడ, వీథివెంట వీథి గడచిపోవుచున్నవి. "ఆహా! కపిల వస్తునగరము ఎంత బాగున్నది! రాజమార్గము ఎంత పరి శుభ్రముగా నున్నది! ప్రజలందరు నెంత సంతోషముగా నున్నారు! రథము మరికొంచెము ముందున కరిగినది. గౌతమునకు మరింత పెద్దమేడలు కనిపించినవి. రథము రాజవీథులన్నియు గడచిపోయినది. "అంతయు చక్కగా ఉన్నది" అనుకొన్నాడు గౌతముడు.

ఇంతలో రాజకుమారుని కొక విచిత్ర దృశ్యము కనిపించినది. ఒక పండు ముదుసలి ముడతలుపడిన చర్మ

ముతో నడచివచ్చుచుండెను. అతని అడుగులు తడబడు చున్నవి. చేతిలోనికఱ్ఱ వణకుచున్నది. నడుము విల్లంబు బద్దవలె వంగిపోయినది. కన్నులు లోపలికి పీకుకొని పోయినవి. తల ముగ్గుబుట్టవలె నెరసిపోయినది. ఎముకలు బయటపడినవి.

ఆ వృద్ధుని చూడగానే రాజకుమారు డులికిపడెను. ఆయన ఆ తాతవైపు రెప్పవాల్చక అట్లే చూచుచుండెను. ఆయన చెన్నుని చూచి "చెన్నా! అదుగో అటుచూడు! ఆ నడిచివచ్చు మనుష్యు డట్లున్నాడేమి! గడగడ వడకు చున్నాడే! ముఖము ముడతలు వడినదే!" అని ఆశ్చర్య ముగా ప్రశ్నించెను. సారథి యువరాజును జూచి "రాజ కుమారా! అది ముసలితనము ప్రభావము. వార్ధక్యము వచ్చిన ప్రతివాడు నిట్లే యగును. ఆ తాతకు దేహమున సత్తువ తగ్గిపోయినది. వట్టి ఎముకల గూడైనాడు" అని సమాధానము చెప్పెను.

చెన్నుని మాటలు విని రాజకుమారుడు "అయిన మనముకూడ నిట్లే మారిపోవుదుమా?" అని అడిగెను. ఆ ప్రశ్నకు చెన్నుడు చిరునవ్వు నవ్వుచు "రాజకుమారా అందులో ఆశ్చర్యమేమున్నది? కాలక్రమమున అంద రము నిట్లే మారిపోవుదుము. ఈ ముసలితనము రాజును,

సేవకుని, లక్షాధికారిని, బిక్షాధికారిని, స్త్రీలను, పురుషులను, ఒకే విధముగా లోబరుచుకొనును" అని పల్కెను. అదివిని గౌతముడు నిర్ఘాంతపోయెను. "అయిన చెన్నా! నేను, నా యశోధర, మా రాహులుడు అందరము నిట్లే యగుదుమా?" అని గౌతముడు సారథిని మరల ప్రశ్నించెను. "చిత్తము. క్రమముగా అందరు నిట్లే యగుదురు ప్రభూ!" అని చెన్నుడనెను. "అమ్మయ్యో! ఈ ముసలితన మెంత భయంకరమైనది!" అని రాజకుమారు డులికిపడెను.

చెన్నుడు గుఱ్ఱముల నదలించెను. రథము మరి కొంచెము ముందున కరిగినది. అంతలో ఆ త్రోవవెంట తూలుచు సోలుచు, పడుచు లేచుచు, ఒక మనుష్యుడు వచ్చుచుండెను. అతని యొడలంతయు గాయములే! వాని మీద ఈగలు ముసురుచున్నవి. దుర్గంధము వచ్చుచున్నది. ముఖము నెత్తురు ముద్దయై పోయినది. అంత వికారముగానున్న ఆ మనుష్యుని చూచునప్పటికి గౌతముని మేను గగుర్పొడిచినది. ఆయన ఆశ్చర్యముతో "చెన్నా! ఇదేమిటి! ఇత డింత వికారముగా నున్నాడేల? వీని యొడలంతయు నిట్లు పాడై పోయిన దెందులకు?" అని ప్రశ్నించెను. సారథి "రాజకుమారా! అతడు కుష్ఠురోగి. అది చాల భయంకరమైన వ్యాధి. ఆ

రోగ మీ మనుష్యుని పీల్చి పిప్పిచేసి వైచినది. దానితో అతడు క్రుంగి కృశించిపోవుచున్నాడు'' అని సమాధానము చెప్పెను.

గౌతముడు ఏమిటీ! ముసలితనమే అనుకొన్నాను. రోగము కూడ నున్నదా లోకములో!'' అనెను. చెన్నుడు "అవును రాజకుమారా! కుష్ఠు, క్షయ, సన్నిపాతము మున్నగున వెన్నియో భయంకర రోగము లున్నవి'' అని పలికెను. గౌతముడు కొంచెము సేపాలోచించి ''అయితే చెన్నా! మనుష్యులందరకు వ్యాధులు వచ్చుచుండునా ?'' అని యడిగెను.

సారథి సందేహించుచు ''ఎందులకు రాకూడదు! మానవుడన్న తరువాత రోగమే రాకుండునా ప్రభూ!'' అని సమాధానము చెప్పెను.

ఆ మాటలు వినుసరికి రాజకుమారుని మనస్సులో నేదో కలవరము బయలుదేరినది. ఆయన రెండు చేతులతో కన్నులు మూసికొని ''ఇక చూడలేను చెన్నా! మన రథము మరలించు'' అని ఆజ్ఞాపించెను.

సారథి రథమును రాజసౌధము వైపునకు మరలించెను. సరిగా నదే సమయమునకు రాజకుమారునికి

మరొక వింత దృశ్యము నయనగోచరమైనది. నలుగురు మనుష్య లొక శవమును మోసికొని వచ్చుచుండిరి. వెనుకప్రక్క కొందరు విలపించుచు వచ్చుచుండిరి. అదంతయు నేమో గౌతమున కర్థము కాలేదు.

"సారథీ! ఏమిటిది? ఆ నలుగురు ఆ మనుష్య నట్లు త్రాళ్ళతో బిగించి తీసికొనివెళ్ళుచున్నారే! అతడు కదలక మెదలక అట్లే పడియున్నాడు! వారు గుండెలు బాదుకొనుచు విలపించుచున్నారు! నా కిదంతయు నయోమయముగ నున్నది" అని ఆయన చెన్నుని ప్రశ్నించెను.

చెన్నుడు "ప్రభూ! ఆ మనుష్యుడు చనిపోయి నాడు. అతని శరీరమునుండి ప్రాణములు లేచిపోయినవి. అది శవము. భూమిమీద పుట్టిన ప్రతి మానవుడు ఎప్పుడో ఒకప్పు డిట్లే మృతుడు కాక తప్పదు" అని ప్రత్యుత్తర మిచ్చెను.

ఆ మాటలు వినునప్పటికి గౌతమునికి చాల భయము కలిగినది. "ఏమిటి చెన్నా! ముసలితనము రోగము రెండే మానవులకు శత్రువు లనుకొంటిని. మృత్యువనెడి మూడవ శత్రువుకూడ కలదన్నమాట! ఈ ముగ్గురు శత్రువుల ప్రభావమునకు లొంగిపోయి ప్రపం

చములోని ప్రజలందరు కృశించి నశించి పోవలసినదేనా! పుస్తకములలో వీనినిగూర్చి చదివినను నీ రోగము, వార్ధక్యము, మృత్యువు, ఇంత భయంకరముగా నుండు నని కొనలేదు. ఇప్పుడు ప్రత్యక్షముగా చూచి ప్రపంచమనగా నేమో గ్రహించినాను'' అని గౌతముడు లోలోపల ఏమేమో తలపోసికొనుచుండెను. అంతలో రథము రాజసౌధమును సమీపించినది.

రాజకుమారుడు రథముదిగి గబగబ రాజభవనములో ప్రవేశించెను. కుమారుని రాకకై ఎదురు చూచుచున్న మహారాజు గౌతముని ముఖలక్షణములు చూచి కలవరపడినాడు. ''ఏమి నాయనా! నగరమంతయు జూచి వచ్చితివా?'' అని ఆయన కుమారు నడిగెను. ''ఆ! అంతయు చూచియే వచ్చితిని'' అని వంచిన తల యెత్తక మహారాజునకు సమాధానము చెప్పి గౌతముడు మందిరములోని కరిగెను.



# మహాప్రస్థానము

ఆ రాత్రి గౌతమునకు నిద్రపట్టలేదు. ఆయన మానసములో ఎన్నెన్నో భావతరంగములు పొంగులెత్తు చుండెను. ఆ నాడు నగరములో తన కంటబడిన విషాద దృశ్యముల కాయన హృదయములో కల్లోలము చెలరేగినది.

" ఈ ప్రపంచములో ఏ ప్రక్క చూచినను బాధలే కాని నిజమగు, సౌఖ్యము, సంతోషము లేనేలేదే! ఈ విధముగా అశాంతితో అల్లాడిపోవుచున్న మానవులకు మంచి రోజు లెప్పుడు వచ్చునో! శోకముతో క్రుంగిపోవు నీ లోకమునకు విముక్తి యెన్నడు కలుగునో! "

ఇట్టి యాలోచనలతో గౌతముడు మెల్లగా కన్ను గూర్కెను. ఆయన ప్రక్కనే పట్టుపరుపుపై యశోధర చిన్ని కొమరునితో మైమరచి నిదురించుచుండెను.

ఆ నిదుర మైకములో రాజకుమారుని కొక తేజో మూర్తి కనుపించి దివ్య సందేశము వినిపించెను. " రాజ కుమారా! లెమ్ము. ఇంక నిద్ర మేల్కొనుము. ఈ రాజ్య భోగములు శాశ్వతములు కావు. వీనిపై కోరిక విడ నాడుము. దారుణహింసలతో దద్దరిల్లుచున్న ప్రాణికోటిని కాపాడుము. దిక్కులేని దీనుల నుద్ధరింపుము. దయా

మయుడవై లోకమున ధర్మమును, శాంతిని స్థాపింపుము. ప్రేమమూర్తివై ప్రపంచమునకు నూత్నకాంతులు ప్రసాదింపుము.''

గౌతము నెవ్వరో వీపుతట్టి లేపినట్లయ్యెను. ఆయన దిగ్గునలేచి కూర్చుండెను. అమాయకురాలు యశోధర నిశ్చింతగా నిదురించుచుండెను. ముద్దుబిడ్డ రాహులుడు తల్లి ప్రక్క నొదిగి పరుండియుండెను. గౌతమున కేదో మార్గము కనుపించినట్లైనది. ఆయన భార్యను, బిడ్డను, రాజ్యమును, మాతాపితలను పరిత్యజించి యరణ్యముల కరుగుటకై నిశ్చయించుకొనెను.

గౌతముడు మెల్లగా తల్పము దిగెను. తన్నే నమ్మి కొని తన తోడిదే లోకమని భావించుకొనుచున్న యశోధరాదేవిని విడనాడి పోవుట కాయన కడుగు సాగలేదు. ఒక్కమాటు కుమారుని ముద్దాడిపోవలయునని ఆయన అనుకొనెను. కాని అట్లు చేసినచో పసిపాప నానుకొని పరుండియున్న యశోధర మేల్కాంచునేమో! ఆమె నిదుర మేల్కొనెనా తన ప్రయాణమున కాటంకము కలుగును. గౌతముడు మెల్లమెల్లగా కవాటము దగ్గరకు వచ్చెను. కాని కాళ్లు ముందునకు సాగుటలేదు. ఆయన

మాటిమాటికి వెనుకకు మరలి చూచుచు ఎట్టెట్లో మేడ మెట్లు దిగెను.

రాజకుమారుడు చకచక అశ్వశాలకు బోయి యట నిద్రించుచున్న చెన్నుని తట్టి లేపెను. చెన్ను ఉలికిపడి లేచి "ఇదేమిటి ప్రభూ! ఈ వేళకాని వేళ మీరేల యిచ్చ టికి వచ్చితిరి?" అని గౌతముని ప్రశ్నించెను. రాజనంద నుడు సారథి వీపు తట్టి "చెన్నా! ఇందు వింతయేమియు లేదు. నీవు వెంటనే గుఱ్ఱమును సిద్ధపరచుము." అని పలికెను.

చెన్నున కేమియు నర్థము కాలేదు. అత డశ్వమును సిద్ధముచేసెను. రాజకుమారుడు గుఱ్ఱమునెక్కి "చెన్నా! నా వెంట రమ్ము" అనెను. అశ్వము కపిలవస్తు నగరము గడచి అరణ్యమార్గము ప్రవేశించినది.

గౌతము డొక చెట్టు క్రిందకుచేరి గుఱ్ఱము దిగెను. తనకు ప్రియమైన యా హయమును బుజ్జగించి చెన్నున కప్పగించెను. "చెన్నా! ఈ రోజుతో నాకును మన రాజ్యమునకును సంబంధము తీరిపోయినది. నేను సన్న్యా సినై సర్వసంగ పరిత్యాగినై సత్యాన్వేషణము చేసి ప్రపంచ మునకు ప్రేమభిక్ష పెట్టబోవుచున్నాను. నన్ను పిన్ననాటి

నుండి ప్రేమతో పెంచి పెద్దచేసిన నా తల్లిదండ్రులకు నా నమస్కారము లందింపుము. నన్ను ప్రాణప్రదముగ ప్రేమించిన యశోధరాదేవిని ధైర్యముగా నుండుమని చెప్పుము. మా చిట్టితండ్రి రాహులునకు నా యాశీస్సులు తెల్పుము. ఇంతకాలమునుండి భక్తి గౌరవములతో నన్ను గొలుచుచుంటివి. అందులకు చాల సంతసించుచున్నాను. ఇక చింతింపకుము. నగరమునకు తిరిగి పొమ్ము" అని గౌతముడు సారథితో ననెను.

ఆ మాటలు విని చెన్నుడు కన్నీరునింపుచు "రాకుమారా! ఎంత పని చేసితిరి! ఈ విషాద వార్త మోసికొనిపోవుటకేనా నన్ను తీసికొని వచ్చితిరి!" అని పెద్దపెట్టున విలపింపసాగెను. గౌతము డాతని నోదార్చి "చెన్నా! దుఃఖింపకుము. ఇది నా కర్తవ్యము. నే నిట్లు చేయక తప్పదు. ఇక నీవు పోయి రమ్ము" అని పలికెను. చెన్నుడు చేయునదిలేక రాజనందనునకు నమస్కరించి గుఱ్ఱమును వెంటబెట్టుకొని యింటికి మరలెను.

తెల్లవారినది. యశోధర నిద్రలేచి చూచుసరికి ప్రాణకాంతుడు కనుపించలేదు. ఆమె గుండెలు దడదడ కొట్టుకొనినవి. ఆమె మందిర మంతయు వెదకినది.

నాథుని జాడ లేదు. మహారాజున కీ విషయము తెలిసినది. శుద్ధోదనుని నెత్తిపై పిడుగు పడినట్లైనది. ఆయన వెంటనే సేవకులను పంపి యంతఃపురమంతయు వెదకించెను. కాని కుమారుడు కనిపించలేదు.

అంతలో మొగము చిన్నబుచ్చుకొని చెన్నుడు రాజమందిరము చేరుకొనెను. గౌతముడు కాననములకు బోయినాడని తెలియగానే మహారాజు నిశ్చేష్టుడై పోయెను. యశోధర సొమ్మసిల్లిపోయినది. కపిలవస్తునగరము గాఢ దుఃఖములో మునిగెను.

గౌతము డా యడవిలో కాలినడకతో చాల దూరము పోయెను. త్రోవలో ఎదురువచ్చిన బీదలకు విలువగల తన వలువలన్నియు నిచ్చి తాను వారి చింకిపాతలను గైకొని ధరించెను. శిరోజములను ఖండించి వైచుకొనెను. రాజ కుమారుడు క్షణములో తాపసకుమారుడుగా మారిపోయెను. ఆయన పోయిపోయి "అనోమా" నదీతీరమును చేరు కొనెను. చేత భిక్షాపాత్ర బట్టుకొని యా చుట్టుప్రక్కల గల పల్లెపట్టులలో నింటింటికి బోయి బిచ్చమెత్తుచు కాలము గడపు చుండెను.

అచ్చటనుండియే అత డెందరో పండితులను గలిసి కొని సంప్రదించెను. శాస్త్రవేత్తలతో ఆలోచించెను. సన్యాసులతో సాంగత్యము చేసుకొనెను. అందరితో చర్చించెను. కాని ఆయనకు ముక్తిమార్గము కనుపించలేదు. ఆయన ఎంతయో నిరాశచెందెను.

ఆ రోజులలో బింబిసారుడను రాజు మగధదేశము నేలుచుండెను. మగధరాజ్యమునకు రాజధాని రాజగృహ నగరము. ఆ నగరము ప్రక్కనే రత్నగిరి యను నొక పర్వతము కలదు. ఒకనాడు గౌతముడు డటునిటు దిరుగుచు నా పర్వత ప్రాంతమునకు వచ్చెను. సరిగా అదే సమయమున ఆ కొండప్రక్కగా కొందరు గొల్లలొక మేకల మందను తోలుకొనిపోవుచుండిరి. అందులో నొక కుంటి మేక పడుచు లేచుచు కాళ్ళీడ్చుచు నెట్లెట్లో నడచిపోవుచుండెను. వెనుకపడుచున్న ఆ మేకను పెద్దగొల్ల కఱ్ఱతో నదలించుచుండెను.

గౌతముడు మేకపిల్లను చూచి జాలిపడెను. ఆయన చకచకబోయి యా కుంటి మేకను చంకకెత్తుకొనెను. ఆ విచిత్రమును చూచి గొల్లలు విస్మితులైరి. గౌతముడు వారివెంట నడచుచు "నాయనలారా! మీ

మేకల నెక్కడకు దోలుకొని పోవుచున్నారు ?" అని ప్రశ్నించెను.

గొల్లలు "స్వామీ ! ఈ రోజు మా మహారాజు గొప్ప యజ్ఞము చేయుచున్నాడు. అందు వీనిని బలి యిచ్చుటకై కొనిపోవుచున్నాము" అని సమాధానము చెప్పిరి.

కొంత సేపటికి వారందరును యజ్ఞశాల చేరుకొనిరి. రాజతేజస్సుతో విరాజిల్లుచున్న గౌతముని గాంచి అందలి వారంద రాశ్చర్యమందిరి. అంతలో యాజకులు బలులు సిద్ధముచేసిరి. యూపస్తంభములకు పశువులను బంధించిరి. ఆర్తనాదము చేయుచున్న ఆ యమాయక జంతువులను చూచి గౌతముని మనస్సు కరిగిపోయినది. ఆయన వెంటనే చేతులెత్తి వారిని వారించుచు "అయ్యలారా ! ఆగుడు. ఆ నోరులేని జంతువులను హింసింపకుడు" అని చకచక పోయి మేకల మెడలకు గట్టియున్నత్రాళ్ళ నూడదీసివైచెను.

అది చూచి బింబిసారమహారాజు ఆశ్చర్యచకితు డయ్యెను. గౌతముడు బింబిసారు నుద్దేశించి "మహారాజా ! పాప మీ దిక్కులేని దీనజంతువులు మీ కే యపకారము చేసినవి ? వీని నిందు ప్రాణములు నిలువున దీయుటకు

మీ హృదయ మెట్లంగీకరించినది ? మన ప్రాణములపై మనకెంత మమకారమో వానికి గూడ నంతియే కదా ! మహారాజా ! మనము పుణ్యసంపాదనమునకై అన్య ప్రాణుల హింసించుట న్యాయముకాదు. దయ — ధర్మము — ప్రేమ మానవజాతి లక్షణములు. ప్రపంచములోని ప్రాణి కోటి యంతయు పరస్పర ప్రేమతో వర్తిల్లవలయును. అహింసయే పరమధర్మము " అని మధుర కంఠముతో పలికెను.

ప్రేమమూర్తి ప్రసంగము వినగానే మగధ మహా రాజు మనస్సు మారిపోయెను, ఆయన వెంటనే ఆ బాల యోగికి నమస్కరించి " స్వామీ ! మీరు నా కన్నులు తెరచితిరి. నాకు కర్తవ్యము బోధించితిరి " అని పలికి నాటినుండి తన రాజ్యములో నెక్కడను జంతుహింసలు జరుగరాదని శాసించెను.

అనంతరము బింబిసారునకా బాలయోగి తన మిత్రుడైన శుద్ధోదన మహారాజు కుమారుడని తెలిసినది. ఆయన, మునివృత్తి మాని హాయిగా రాజ్యము నేలు కొమ్మని గౌతముని పరిపరి విధముల ప్రార్థించెను. కాని గౌతము డంగీకరించ లేదు. గౌతముడు తన నిశ్చయము

నా రాజసభ వెడలి యచటనుండి బయలుదేరి మరల నరణ్యములకు వెడలిపోయెను.

గౌతముడు రత్నగిరి ప్రాంత మందలి కాంతారము లలో కొంతకాలము గడపెను. అనంతర మాయన ఉరువేలా రణ్యము చేరుకొనెను. అచ్చట ఆయనకు నిద్రాహారములు మాని నిశ్చలముగా ఘోర తపస్సు చేయుచున్న ఐదుగురు మునీశ్వరులు కనుపించిరి. గౌతముడు తాను కూడ తపస్సు చేయ నారంభించెను. ఆయన దృఢదీక్ష కబ్బురపడుచు నా యైదుగురు తాపసు లాయన శిష్యులైరి.

ఆహారము [illegible] ఉండుటచే క్రమముగా గౌతముని దేహము కృశించిపోయినది. కండలు కరిగి పోయినవి. నరములు బలహీనము లైనవి. అవయవములు స్వాధీనము తప్పినవి. అటు నిటు కదలుటకు కూడ ఆయన కోపిక లేదు.

ఒకనాటి మధ్యాహ్న సమయమున మండు టెండలో గౌతముడు సొమ్మసిల్లి క్రిందపడిపోయెను. సరిగా అదేసమయమున ఆ సమీపమున మేకలు కాయుచున్న గొల్లపిల్లవా డొకడు ఆయనను చూచెను. వెంటనే యతడు గౌతముని యొద్దకు పరుగెత్తుకొని

వచ్చెను. గబగబ దోసిలితో నీరు తెచ్చి యాయన ముఖముపై చల్లెను. తన యుత్తరీయముతో చల్లగా విసరెను. వడివడిగా మేకపాలు పిండి తెచ్చి యాయన నోటిలో బోసెను. పాలు త్రాగుసరికి గౌతమునకు కొంచెము తెలివి వచ్చినది. ఆయన బాలుని ప్రేమ పూర్వకముగా చూచి "నాయనా! పోవుచున్న నా ప్రాణములు నిలువబెట్టితివి! నీ మేలు మరువలేను" అని చేతులెత్తి యాశీర్వదించెను.

ఆనాటి నుండి గౌతముడు క్రమముగా అహారము స్వీకరించుచుండెను. ఎల్లప్పుడు కూర్చుండి ముక్తి మార్గమును గూర్చి ఆలోచించుచుండెను.

ఒకరోజున గౌతముడు ధ్యానమగ్నుడై యున్నప్పు డొక కాపు వెలది యచ్చటకు వచ్చెను. ఆమె పేరు సుజాత. సుజాత సద్గుణవతి. ఆమెకు కావలసినన్ని భోగ భాగ్యము లున్నవి. కాని సంతానము మాత్రము లేదు. ఆమె కనుపించిన దేవతకెల్ల తన యీప్సిత మీడేర్చుమని మ్రొక్కుకొను చుండెడిది.

సుజాత సంవత్సరము క్రిందట తపోదీక్షలోనున్న గౌతముని వనదేవతగా భావించి మ్రొక్కుకొనిపోయెను.

ఆమెకోర్కె సిద్ధించినది. ఈ నాడామె తన మ్రొక్కు తీర్చుటకై యరుదెంచినది. ఆమె చేతిలోని వెండిగిన్నె నిండ కమ్మని వేడిపాయస ముండెను. సుజాత భక్తిశ్రద్ధలతో పాయసము గిన్నె గౌతమున కర్పించినది.

గౌతముడు కన్నులు తెరచి చూచి "అమ్మా! నీ వెవ్వరవు? నాకై ఈ పాయసమేల తెచ్చితివి?" అని మెల్లగా ప్రశ్నించెను. సుజాత చేతులుమోడ్చి "మహాత్మా! నేను కాపుకాంతను. ఏడాదిక్రిందట తమ సన్నిధికివచ్చితిని. వనదేవతలగు తమ కరుణ నాపై ప్రసరించినది. స్వామీ! ఇప్పుడు మా యిల్లు పాలబుగ్గల పాపాయితో కళకళలాడు చున్నది. నా యదృష్టము పండినది. నా జన్మము ధన్యమైనది. నేడు సంతోషముతో తమ కీ పాయసము నుపాయనముగా దెచ్చితిని. దయచేసి స్వీకరింపుడు" అని ప్రార్థించెను.

సుజాత భక్తిశ్రద్ధలకు శాక్యముని ఎంతయో సంతసించెను. "తల్లీ! నేను వనదేవతనుకాను. సామాన్య మానవుడను. లోకమునకు కల్యాణము సమకూర్చుటకై, విశ్వమునకు దుఃఖముల నుండి విముక్తి కలిగించుటకై మార్గము వెదకుచు నీ యరణ్యములకు వచ్చితిని. నీ భక్తికి చాల

మెచ్చుకొంటిని తల్లీ! నీ బిడ్డ నీవలెనే దయామయుడై ఆయురారోగ్యములతో వర్ధిల్లుగాక!" అని ప్రేమమూర్తి సుజాత నాశీర్వదించెను. సుజాత మహానందముతో శాక్య మునికి ప్రణామముచేసి సెలవుదీసికొని గృహమున కరిగెను.

గౌతముడు కాపువెలది చేతి పాయసము స్వీకరించు టచే భ్రష్టుడైనాడని ఆయన శిష్యులైదుగురు తలంచిరి. వారు కోపోద్రేకములతో వెన్వెంటనే గౌతముని విడిచి వెడలిపోయిరి.

గౌతము డొక యశ్వత్థవృక్షముక్రింద కన్నులు మూసికొని కూర్చుండి ఏదియో ఆలోచించుచుండెను. ఒక నాటి పండువెన్నెలలో ఆయన హృదయమున నేదో పవిత్ర భావ ముదయించినది. ఆయన కన్నులకు ధర్మజ్యోతి కనుపించినది. ఆయన వీనులకు సత్యవాణి వినుపించినది. ఆయనకు ముక్తిమార్గము గోచరించినది. గౌతముడు బుద్ధుడైనాడు. అశ్వత్థము బోధివృక్షమను పేరు దాల్చినది.



# ధర్మ చక్రము

గౌతమబుద్ధుడు తాను గ్రహించిన ధర్మములను ప్రజలలో ప్రచారము చేయవలెనని బయలుదేరెను. ప్రథమముగా ఆయన తన మతమును కొలదికాలముక్రిందట తన్ను విడనాడిపోయిన ఐదుగురు శిష్యులకు బోధింపవలయునని తలంచెను. సుజాత చేతి పాలుత్రాగి గౌతముడు భ్రష్టుడైనాడని భావించి వెడలిపోయిన యాయన శిష్యపంచకము "మృగదావము"న తపస్సు చేసికొనుచుండిరి. అందుచే బుద్ధభగవానుడు మృగదావనమునకు ప్రయాణమైపోయెను.

ఐదుగురు మును లల్లంతదూరముననే గౌతమబుద్ధుని కనుగొనిరి. వా రాతనిని గౌరవింపరాదనియు, పలుకరింపరాదనియు తలంచిరి. కాని కరుణామయుడగు నా మహాత్ముడు సమీపమునకు రాగానే వారందరు లేచి యాయనకు నమస్కరించిరి. భక్తిపూర్వకముగా ఆహ్వానించి యతిథి సపర్యలుచేసిరి. అట్లు వారి మనస్సులు మారినందులకు బుద్ధభగవాను డెంతయో సంతోషించెను. ఆయన వారికి మహత్తరములగు తన మత సిద్ధాంతముల

ప్రబోధించెను. ఆ ప్రేమమూర్తి మధుర వాక్యములు విని వారైదుగురు నాయనకు ప్రధాన శిష్యులైరి.

అనంతరము గౌతమబుద్ధుడు వారణాసి నగరవాసి యగు యాసునకు గూడ ధర్మదీక్ష నిచ్చి తన మతములో కలుపుకొనెను. యాసుడు గొప్ప భాగ్యవంతుడు. అతని కొకనాడు సంసారభోగములపై విరక్తికలిగినది. వెంటనే యతడు బుద్ధభగవానుని సందర్శించి యాయన బోధలంది శిష్యుడయ్యెను.

ఆ రోజులలో మగధరాజ్యమున ముగ్గురు మహాను భావు లుండిరి. వారిలో నొక్కొక్కరి యొద్ద వేలకొలది శిష్యులు కూడ కలరు. బుద్ధభగవాను డా ముగ్గురు పండితు లను శిష్యసమేతముగా తన మతములో గలుపుకొనెను. అప్పటినుండి యాయన కీర్తిలతలు నలుదిక్కుల నల్లుకొన సాగెను. ఆయన మహాత్మ్యము విని మగధమహారాజగు బింబిసారు డాయనను పిలిపించి గౌరవించి తాను గూడ బౌద్ధమతమును స్వీకరించెను. గౌతమబుద్ధుడు బింబిసారుడు తనకు భక్తితో సమర్పించిన "వేలువనము" లో శిష్యు లతో గూడి నివసించుచుండెను.

బుద్ధభగవానుడు వేలువనములో నున్నాడని శుద్ధో దన మహారాజునకు దెలిసెను. ఆయన వెంటనే కుమారుని కపిలవస్తునగరమునకు దయసేయవలసినదని యాహ్వా నించెను. గౌతముడు తండ్రికోరిక నంగీకరించెను.

ఆ నాడు కపిలవస్తు పట్టణములో నే ప్రక్కగాంచి నను సంతోషము వెల్లివెరియుచుండెను. వీథివీథిలో ప్రతి ద్వారమున మంగళతోరణములు విరాజిల్లుచుండెను. ప్రజ లందరు వేయి కన్నులతో బుద్ధభగవానుని రాక కెదురు చూచుచుండిరి. గౌతముడు తన అరువదివేల శిష్యులతో కపిలవస్తునగరమును సమీపించెను. ఆయనకు వరుసగా బారులు తీరి నిల్చుండియుండిన ఐదువందలమంది బాల బాలికలు స్వాగతమిచ్చిరి. వారి ప్రక్కనే రాజకుటుంబము, బంధుమిత్రపరివారజనము వేచియుండెను. బుద్ధభగవానుడు తన తండ్రి ఆదరాభిమానములతో నిచ్చిన యాతిథ్యము స్వీకరించెను. ఆ మరునాడే ఆయన తన అలవాటు ప్రకా రము చేతిలో భిక్షాపాత్ర ధరించెను. కపిలవస్తుపట్టణములో తన కన్నులముందే ఇంటింటికిబోయి బిచ్చమెత్తుచున్న కన్నకొడుకును కనుగొనునప్పటికి మహారాజు మనస్సు సంక్షుభితమైపోయెను.

శుద్ధోదన మహారాజు కుమారుని గాంచి 'నాయనా! ఇదేమి! మణికిరీటము ధరించి సింహాసనమెక్కి మహా వైభవముగా రాజ్యమేలవలసిన నీవు భిక్షాపాత్ర గైకొని కాషాయవస్త్రములు గట్టి ఇంటింటికిపోయి తిరిపెమెత్తుట నేను చూడలేకున్నాను. తండ్రీ! నిక పెంచిన తలిదండ్రు లను కట్టుకొన్న సతీమణిని చిట్టితండ్రి రాహులుని విడనాడి కారుచీకటిలో కాననముల కరిగితివి! నీ కోసరమై శోకించి శోకించి యశోధర కుమిలిపోవుచున్నది. "నాన్న యెప్పుడు వచ్చును? ఎప్పుడు వచ్చును" నని రాహులు డెదురు చూచుచున్నాడు" అని పలికి కన్నుల నీరు పెట్టుకొనెను.

బుద్ధభగవానుడు తండ్రి నోదార్చుచు "మహారాజా చింతింపకుడు. నేను లోకము నుద్ధరించుటకై చంచలము లైన రాజసౌఖ్యములు విడచి యరణ్యముల కరుగవలసి వచ్చినది. శోకము బాపుటకై నేను మరలివచ్చినాను. ఇదిగో దుఃఖదూరకమగు నా ధర్మదీక్ష నందుకొనుడు"అని పలికి యాయనకు తమ మతసిద్ధాంతములు బోధించెను.

అంతలో యశోధర రూపుదాల్చిన శోకదేవత వలె వచ్చి "ప్రభూ!" అని భగవానుని పాదములపైవ్రాలెను.

రాహులుడు పరుగు పరుగున వచ్చి చిగురుచేతు లెత్తి తండ్రికి నమస్కారము చేసెను. బుద్ధదేవుడు భార్య నోదార్చి కుమారుని బుజ్జగించెను. యశోధర డగ్గుత్తికతో "నాథా! మీరు నా ప్రాణనాథు లనుకొంటినే కాని జగన్నాథులని యెరుగనైతిని ప్రభూ! మీ ప్రేమ నా కొక్కర్తెకే ప్రసాదించి రనుకొంటిని కాని ప్రపంచమునకెల్ల పంచిపెట్టుదురని భావించనైతిని" అని పలికెను. బుద్ధ భగవాను డామెకు ధైర్యము చెప్పి ధర్మప్రబోధము చేసెను. అనంతరము ప్రజావతి, చెన్నుడు మున్నగు వారికి గూడ ఆయన బౌద్ధ ధర్మము లుపదేశించెను.

బుద్ధ భగవానుడు కపిలవస్తు నగరము నుండి బయలుదేరి దేశమంతయు బర్యటించుచు తన మత ప్రచారము చేసెను. కొలది కాలములోనే దేశము నలుదిశల బౌద్ధమతము వ్యాపించినది. స్త్రీలు పురుషులు, పెద్దలు పిన్నలు, రాజులు పేదలు, నెందరెందరో బౌద్ధ మతము స్వీకరించిరి. వేలకొలది జనులు విసుగు విరామము లేకుండ నిరంతర మాయనను సందర్శింప వచ్చుచుండిరి. ఆయన వచనామృతమును తనివిదీర గ్రోలుచుండిరి. ఎటుకన్నను బౌద్ధభిక్షువులే! ఏ వంక విన్నను

' బుద్ధం శరణం గచ్ఛామి — ధర్మం శరణం గచ్ఛామి — సంఘం శరణం గచ్ఛామి ' అను నినాదములే !

ఆ కాలములో ' ప్రసేనజిత్తు ' అను రాజు కోసల దేశము నేలుచుండెను. ఆయన రాజ్యములో ' అంగుళీ మాలు ' డను నొక అడవి దొంగ యుండెను. ఆ గజ దొంగ కడు క్రూరుడు. అతడు కోసలదేశములో పల్లెలపై పట్టణములపై బడి ప్రజలను కొల్లగొట్టుచుండెను. వాని బారిజిక్కి ప్రాణములతో బైట బడుట యసాధ్యము. ఆ చోరుని పేరు విన్నమాత్రముననే ప్రజల గుండెలు పగిలి పోవుచుండెను.

ఆ గజ దొంగ వృత్తాంతము బుద్ధభగవానునకు దెలియవచ్చినది. ఆయన ఆ చోరు నెట్లైన క్రూరకృత్యములనుండి మరల్పవలెనని నిశ్చయించుకొనెను. అందులకై కరుణమూర్తి అంగుళీమాలుడు నివసించుచున్న యరణ్యమును చేరుకొనెను. అల్లంత దూరముననే అంగుళీమాలుడు చేత భిక్షాపాత్ర ధరించి నిర్భయముగా తనకడ కరుదెంచుచున్న బుద్ధదేవుని దర్శించెను.

అంగుళీమాలుడు పరుగుపరుగున వచ్చి గుడ్లెఱ్ఱ చేయుచు " ఓ సన్యాసి ! ఆగు. నా కంటబడి నీ వెట్లు

తప్పించుకొని పోయెదవు!" అని బుద్ధభగవానునిమీదికి దూకెను. కరుణమూర్తి కాలుకదల్పలేదు. ఆయన యట్లే నిలుచుండి యా గజదొంగను కన్నార్పక గాంచుచుండెను. అంగుళీమాళుడు భయంకరమైన గండ్రగొడ్డలి నెత్తెను. ప్రేమమూర్తి చిరునవ్వు నవ్వెను. అంతటితో గజదొంగ నిస్తబ్ధుడై పోయెను. అతని చేతులు కదలలేదు. దృష్టిమారలేదు. అతడు గౌతమబుద్ధునివంక తెప్పవేయక చూచెను. అతని చేతిలోని గండ్రగొడ్డలి జారి క్రిందపడిపోయెను. గజదొంగ కన్నీరునింపుచు బుద్ధభగవానుని పాదపద్మములపై బడి "స్వామీ! నన్ను కరుణింపుడు" అని ప్రార్థించెను. భగవాను డాతని చేతులుబట్టి యెత్తి "నాయనా! లెమ్ము. నీవు చేసిన పాపములకు పశ్చాత్తాపమందుము. ఇక సన్మార్గమున సంచరింపుము" అనెను. అంగుళీమాలుడు చేతులు మోడ్చి "స్వామీ! నేనెన్నియో హత్యలు చేసితిని. ఎందరి తలలో పగులగొట్టితిని. ఎందరినో హింసించితిని. ఎందరెందరి ధనములో దోచుకొంటిని. నన్ను మన్నింపుడు. మీ ముఖము చూడగానే నా కేదో పవిత్రభావము కలిగినది. మీ కన్నుల కాంతి కనుగొనగానే నా మనస్సు మారిపోయినది. నేను మీ శిష్యుడ నగుచున్నాను. నన్ను దయ చూడుడు" అని వేడుకొనెను.

ప్రేమమూర్తి తన చల్లని చేతితో నాతని మేను నిమిరి "ఓయీ! చింతపడకుము. నేటినుండి నీవు నాశిష్య కోటిలోని వాడవు!" అని యాతనికి తన ధర్మముల నుప దేశించెను.

బుద్ధభగవానుడు శిష్యసమేతుడై మరలివచ్చుచుం డెను. సరిగా నదే సమయమున కోసలరాజు ప్రసేనజిత్తు మెరికలవంటి వీరులను పదివేలమందిని వెంటబెట్టుకొని యా మార్గమున వచ్చుచుండెను. భగవాను డాయనను జూచి "రాజా! ఎక్కడకు బోవుచుంటిరి?" అని ప్రశ్నించెను. కోసలరాజు బుద్ధదేవునకు నమస్కరించి "స్వామీ! ఈ ప్రాంతమున గల కాంతారములో అంగుళీమాలు డను నొక గజదొంగ యున్నాడు. ఆ దుర్మార్గుని దుశ్చర్యలకు మా రాజ్యములోని ప్రజ లల్లాడిపోవుచున్నారు. ఆ పాపాత్ముని పట్టి బంధించుటకై ఈ వీరులతో వచ్చుచున్నాను" అని సమాధానము చెప్పెను.

ఆ మాటలు విని బుద్ధభగవానుడు మందహాసము చేయుచు "మహారాజా! ఆ గజదొంగ ఇడుగో! ఈ బౌద్ధ భిక్షువే అంగుళీమాలుడు" అని పలికెను. ప్రసేనజిత్తు విస్మితుడై "ఏమిటి స్వామీ! అంగుళీమాలుడు బౌద్ధ

మతము నవలంబించినాడా! ఎంత వింత! కరుణ ఎరుగని గజదొంగ ప్రేమమూర్తి వెనుక పిల్లివలె వచ్చుచున్నాడు! స్వామీ మీ వదనములో, వచనములో ఎంత మహత్తర శక్తి యున్నది!" అని యాయనకు ప్రదక్షిణము చేసి ప్రణామము సలిపి సెలవు దీసికొని వెనుకకు వెడలిపోయెను.

ఒకనాడు బుద్ధభగవానుడు తన శిష్యులతో ముచ్చటించుచు కూర్చుండి యుండెను. ఆ సమయమున నొక బీదరాలు గుండెలు బాదుకొని యేడ్చుచు నచ్చటికి వచ్చెను. ఆమె చేతిలో నొక పసిబిడ్డ మృతకళేబర ముండెను. ఆమె భగవానుని చూచి "స్వామీ! ఇది నాముద్దులబిడ్డని శవము. నేను ప్రాణసమానముగా పెంచుకొనుచున్న ఈనాకుమారుడు నేడు మరణించినాడు. నా యాశలన్నియు నీ చిట్టితండ్రిపై పెట్టుకొంటిని. నాబంగారు తండ్రి నన్ను విడచిపోయినాడు. కరుణామయా! నాబిడ్డని బ్రతికింపుము. నా కడుపు మంట చల్లార్చుము. ఈ దుఃఖమును నేను భరింపలేను. స్వామీ! మీరే నాకుమారునికి ప్రాణదానము చేయవలయును. మీరు మహాత్ములు. మీకు సాధ్యము కానిది లేదు. నన్నను గ్రహింపుడు" అని పరిపరివిధముల దీనముగా వేడుకొన సాగెను.

బుద్ధభగవాను డా యమాయకురాలి కోర్కె విని యాశ్చర్యమందెను. ఆయన యాబీదరాలిని చూచి "అమ్మా! దుఃఖింపకుము. చేతనై నంతవరకు ప్రయత్నించి చూచెదను. అయిన, నీ వొక్కపని చేయవలయును. ఏ మందువా ? నీవు వెంటనే యూరిలోనికి బోయి గరిటెడు 'ఆవాలు' తీసి కొని రావలయును. అవి దుఃఖము నెరుగనివారి యింటి యొద్ద నుండియే తేవలయును. వెంటనేపోయి రమ్మ"అని పలికెను.

బీదరాలు సంతోషముగా ఆవాలు తీసికొనివచ్చుటకై యూరిలోనికి బోయెను. ఆమె యొక యింటికడకు బోయి "అమ్మా ! నా కొక్క గరిటెడు ఆవాలు నొసంగుము. భగ వానుని దయవలన నా బిడ్డని బ్రతికించుకొందును" అని యడిగెను. ఆ యింటిలోని స్త్రీ "అట్లే తీసికొనిపో తల్లీ! బిడ్డడు బ్రతుకుచుండగా ఆవా లెంత భాగ్యము !" అని పలి కెను. బీదరాలు "అమ్మా మీరు దుఃఖము నెరుగరుకదా!" అనెను. అందుల కా గృహిణి కన్నీరు నింపుకొనుచు "ఎరుగకేమి తల్లీ! చేతి కక్కరవచ్చిన చెట్టంత కొడుకు నిరు డీ రోజులలోనే మరణించినాడు. ఆ దుఃఖముతో మే మల్లాడిపోవుచున్నాము" అని పలికెను. బీదరాలు

చకచక మరియొక యింటికిబోయి యడిగెను. ఆ యింటిలో పాపము భర్తను గోల్పోయిన భార్య పరితపించుచుండెను. ఇట్లే బీదరాలు ప్రతి యింటికి బోయినది. ఇంటింట నేదో యొక రూపముగా నందరు దుఃఖము ననుభవించుచునే యున్నారు. కొందరు తండ్రులు పోయినవారు, కొందరు భార్యల గోల్పోయినవారు, కొందరు పిల్లల బోగొట్టుకొన్న వారు. ఈ విధముగా ప్రతివారికి నేదో యొక దుఃఖము !

బీదరాలు దినమంతయు దిరిగి తిరిగి విసిగి వేసారి పోయినది. ఆమె నిరాశపడి తిరిగి వచ్చి బుద్ధభగవాను నితో "స్వామీ ! ఎంత వెదకినను సంతాపములేనివారు నాకు కనిపించలేదు. ఆవాలు లభించలేదు" అని విన్న వించుకొనెను.

బుద్ధభగవానుడు దయామయ హృదయముతో నామె నోదార్చుచు "అమ్మా ! చూచితివా ! లోకమున నెక్కడ చూచినను శోకము కనుపించుచునే యున్నది. జననము మరణము ప్రాణులకు సహజము. చనిపోయిన వారికై విచారించుట వివేకము కాదు. మనస్సు దిటవు పరచుకొన వలయును. ఈ విశ్వమే విషాదమయమైనది. కష్టములలో

ఓర్పు వహించుచు కాలము గడపుకొనుట మంచిది. " అని పలికెను.

భగవానుని పలుకులు వినగానే బీదరాలు ధైర్యము దెచ్చుకొనెను. ఆమె మెల్లగా లేచి కుమారుని శవమున కంత్యక్రియలు చేసెను. అనంతరము కరుణామూర్తి యామెకు ధర్మోపదేశము చేసెను. బీదరాలు బౌద్ధభిక్షుకి యైనది.

బుద్ధభగవానుడు క్రమముగా దేశమునం దెల్లెడల తన ధర్మమును ప్రచారముచేసెను. ధర్మము, సత్యము, దయ, ప్రేమ యివియే మానవజాతికి మంగళకరములగు మహామంత్రములని యాయన బోధించెను. అహింసయే పరమ ధర్మమని ఆయన ఎలుగెత్తి చాటెను. సర్వప్రాణులపై ప్రేమ కలిగియుండవలెనని ఆయన యుపదేశించెను.

బుద్ధభగవానుడు తన యెనుబదవయేట సిద్ధిపొందెను. అనంతర మాయన ప్రియ శిష్యులు పరమపవిత్రమగు బౌద్ధ మతమును ప్రపంచమంతయు ప్రచారము చేసిరి.

జావా, సుమిత్ర, చీనా, జపాను, సింహళము మొదలగు దేశములలో బౌద్ధ మతము విశేషముగ వ్యాపించెను.

తరువాత కొంతకాలమునకు "అశోక చక్రవర్తి" బౌద్ధమతము నవలంబించి దానిని ఖండ ఖండాంతరములలో వెలయించెను. ఆ యశోకుని ధర్మచక్రమే నేడు మన భారత జాతీయపతాకములో అందాలు చిందుచున్నది.

